# భారత తంతి & తపాలశాఖ

ప్రకటన

భారత తంతి & తపాలశాఖ, ఆంధ్రా సర్కిల్ లోని కొన్ని సబార్డినేట్ ఉద్యోగములకు రిక్రూట్ మెంటు వివరములు:—

ఆంధ్ర సర్కిల్, ఇండియన్ తంతి & తపాలా శాఖలో దిగువ వివరింపబడిన ఖాళీలకు రు. 60-4-120 EB-5-170 స్కేలులోగుమాస్తాలు, సార్టర్లు, టెలిఫోన్ ఆపరేటర్లు, టెలిగ్రాఫిస్టులు, కేడరులో నియమింపబడుటకు తగిన అర్హతలు గలవారినుండి దరఖాస్తులు కోరబడుచున్నవి.

2. విద్యార్హత, అనగా మెట్రిక్యులేషను గాని లేక దానికి సమానమైన పరీక్షలో, ఇంగ్లీషు, లెక్కలు,(అరిత్ మెటిక్) భూగోళం, (లేక సోషల్ స్టడీస్) మరియు హిందీ (లేక లోకల్ రీజనల్) భాష పాఠ్యభాగముగాగలిగి ప్యాసైయుండవలెను.

3. టెలిగ్రాఫిస్టులుగా నియమింపబడు అభ్యర్థులు 17 సం॥ల వయసుకు లోబడియుండరాదు. ఇతర కేడరు ఉద్యోగములకు 18 సం॥ల వయసుకు లోబడకుండాను, దరఖాస్తు పంపుటకు నిర్ణయింపబడిన ఆఖరు తేదీనాటికి 28 సం॥లు మించకుండానుయుండవలెను. షెడ్యూల్డుకులములవారికిన్ని, షెడ్యూల్డు తెగల అభ్యర్థులకున్ను వయోపరిమితి 28 సం॥లు. తీసివేయబడి పట్టీలయు తగ్గించబడిన సెంట్రల్ గవర్నమెంటు అభ్యర్థులకున్ను సడలింపబడిన వయోపరిమితి 31-12-53 వరకు అమలులో నుండును. గవర్నమెంటుకు అవసరమని తోచిన ఆపైనకూడా యీ సడలింపు పొడిగింపబడును.

4. ఇందుకొరకు ప్రత్యేకముగా నియమింపబడిన డిపార్టుమెంటల్ ఆఫీసర్ల బోర్డుచే అభ్యర్థుల సెలెక్షన చేయబడును. ఈ సెలెక్షనులో అభ్యర్థులు పైన తెలిపిన పరీక్షలలో తీసిన మార్కులు ముఖ్యముగా గమనింపబడును. హెచ్చు విద్యార్హతలుగల అభ్యర్థులకున్ను, తంతి & తపాలా శాఖ పనులలో అనుభవమున్న అభ్యర్థులకున్ను, హెచ్చు మార్కులు యివ్వబడును.

5. సెలెక్టుకాబడిన అభ్యర్థులకు ఉద్యోగములు, వారి వైద్యపరీక్షలో నెగ్గుట, తగిన యోగ్యతలు ప్రవర్తన దృవల కలిగియుండుట పై ఆధారపడియుండును. ఇందుకు తగిన విచారణలు గమనింపబడును.

6. ఏ యూనిటులో ఉద్యోగముకావలెనని అభ్యర్థికోరెనో, ఆయూనిటు డివిజనలు ఆఫీసర్లద్వారా దరఖాస్తులు పొందవచ్చును. మరియు కాకినాడ, కర్నూలు గవర్నమెంటు టెలిగ్రాఫ్ ఆఫీసులలో టెలిగ్రాఫిస్టులు గాను, గుమాస్తాలుగాను ఉద్యోగముకోరువారు, కర్నూలు, డైరెక్టరు ఆఫ్ పోస్టుస్ & టెలిగ్రాఫ్స్ వారి ఆఫీసుద్వారా ఫారము 1 కి ఇండియన్ పోస్టల్ ఆర్డరుద్వారా ఒకరూపాయమాత్రము చెల్లించి, పొందవచ్చును. షెడ్యూల్డు తెగలకు, షెడ్యూల్డుకులములవారికి దరఖాస్తుఫారము నాలుగు అణాలు మాత్రమే. సదరు సొమ్మును వారి సమీప మండలి పోస్టాఫీసునందు చెల్లించి పొందిన రశీదును ఆయా ఆఫీసర్లకు తమ దరఖాస్తుతో టె పంపవలెను. దరఖాస్తుఫారములు తీసికొనుటకు ఆఖరు తేది 1954 జనవరి 9. పూర్తిచేసిన దరఖాస్తుఫారములు ఆయా ఆఫీసర్లకు 1954 జనవరి 26 లోగా పంపవలెను. ఈ దరఖాస్తులను "ఉద్యోగమునకు దరఖాస్తు" అని కవరుపైవ్రాసి రిజస్టరు పోస్టులో పంపవలెను.

7. తమ యూనిట్ డివిజనల్ హెడ్ ద్వారా దరఖాస్తు పంపిన నేగాని ఒక అభ్యర్థి దరఖాస్తు అంగీకరింపబడదు. మరొక యూనిట్ ద్వారా దరఖాస్తుచేసియుండిన, ఆ విషయము తమ దరఖాస్తులన్నింటిలోను తెలుపవలెను.

8 ఆఫీసర్లకు పంపు ఉత్తరములు ఆఫీసర్ల హోదాలతో పంపవలెనే గాని పేర్లు వ్రాసి పంపకూడదు.

| యూనిట్ల వివరము, సదరు యూనిట్ల ఛార్జిలోయుండు ఆఫీసర్లు | ఖాళీలు, సుమారు నెంబరు ఎస్.సి. | ఎస్ టి. | ఏ.ఐ. | ఇతర తెగలు |
|---|---|---|---|---|
| **గుమాస్తాలు (పోస్టు ఆఫీసులు)** | | | | |
| సూపరింటెండెంటు ఆఫ్ పోస్టు ఆఫీసెస్, కర్నూలు | 5 | [illegible] | - | 30 |
| సూపరింటెండెంటు ఆఫ్ పోస్టు ఆఫీసెస్, నెల్లూరు. | 5 | 2 | - | 31 |
| సూపరింటెండెంటు ఆఫ్ పోస్టు ఆఫీసెస్, గుంటూరు. | 4 | 1 | - | 24 |
| సూపరింటెండెంటు ఆఫ్ పోస్టు ఆఫీసెస్, తూర్పు గోదావరి, రాజమండ్రి. | 3 | 1 | - | 13 |
| సూపరింటెండెంటు ఆఫ్ పోస్టు ఆఫీసెస్, పశ్చిమ గోదావరి, ఏలూరు. | 1 | - | - | 10 |
| సూపరింటెండెంటు ఆఫ్ పోస్టు ఆఫీసెస్, కృష్ణ, చిలకలపూడి. | 3 | 1 | - | 17 |
| సూపరింటెండెంటు ఆఫ్ పోస్టు ఆఫీసెస్, విశాఖపట్నం, మహారాణి పేట. | 4 | 2 | - | 24 |
| **గుమాస్తాలు (టెలిగ్రాఫ్స ఆఫీసులు)** | | | | |
| గవర్నమెంటు టెలిగ్రాఫ్ ఆఫీసు విజయవాడ, సూపరింటెండెంటు-ఇన్-ఛార్జి, గవర్నమెంటు టెలిగ్రాఫ్ ఆఫీసు, విజయవాడ. | - | - | - | 4 |
| గవర్నమెంటు టెలిగ్రాఫ్ ఆఫీసు విశాఖపట్నం, సూపరింటెండెంటు-ఇన్-ఛార్జి, గవర్నమెంటు టెలిగ్రాఫ్ ఆఫీసు, విశాఖపట్నం. | - | - | - | 2 |
| గవర్నమెంటు టెలిగ్రాఫ్ ఆఫీసు కర్నూలు & కాకినాడ, డైరెక్టర్ ఆఫ్ పోస్టుస్ & టెలిగ్రాఫ్స్ ఆంధ్రా సర్కిల్, కర్నూలు. | - | - | - | 2 |
| **గుమాస్తాలు (ఇంజనీరింగు ఆఫీసులు)** | | | | |
| విశాఖపట్నం ఇంజనీరింగు డివిజన్, డివిజనల్ ఇంజనీరు టెలిగ్రాఫ్స్, వాల్తేరు. | 3 | 1 | - | 13 |
| కర్నూలు ఇంజనీరింగు డివిజన్, డివిజనల్ ఆఫీసర్ టెలిగ్రాఫ్స్, కర్నూలు. | 1 | - | - | 7 |
| **సార్టర్సు** | | | | |
| సూపరింటెండెంటు ఆర్. యం. యస్ 'వై' డివిజన్, విజయవాడ. | 8 | 3 | - | 56 |
| **టెలిఫోన్ ఆపరేటర్లు** | | | | |
| విశాఖపట్నం ఇంజనీరింగు డివిజన్, డివిజనల్ ఇంజనీరు టెలిగ్రాఫ్స్, వాల్తేరు. | 5 | 3 | - | 29 |
| కర్నూలు ఇంజనీరింగు డివిజన్, డివిజనల్ ఆఫీసర్, టెలిగ్రాఫ్స్, కర్నూలు. | - | - | - | 2 |
| **టెలిగ్రాఫిస్టులు** | | | | |
| డైరెక్టరు ఆఫ్ పోస్టుస్ & టెలిగ్రాఫ్స్ ఆంధ్రా సర్కిల్, కర్నూలు. | 4 | 2 | 11 | 17 |

డైరెక్టర్ ఆఫ్ పోస్టుస్ & టెలిగ్రాఫ్స్,
ఆంధ్రా సర్కిల్, కర్నూలు.

# విద్యాప్రమాణాల పతనానికి బాధ్యులెవరు?

— ఒక ఉపాధ్యాయుడు —

ఎక్కడ చూచినా, ప్రస్తుతం విద్యాప్రమాణాల తగ్గుదల స్పష్టంగా కనిపిస్తోంది. పెద్దలు ఈ విషయం గమనించినట్టు కూడా, వారు తరుచుగా చేస్తూ ఉన్న ప్రసంగాలను బట్టి తెలుస్తోంది. దానికి కారణా లేమిటో సరిగా విచారించక, దాని బాధ్యత అంతా ఉపాధ్యాయుల మీదనే వేస్తున్నారు, చాలామంది. అది సమంజసం కాదు. కొంత బాధ్యత విద్యార్థులది కూడా ఉన్నది. అసలు ఎక్కువ బాధ్యత తదితరులది-అంటే విద్యార్థుల తల్లిదండ్రులు, ప్రభుత్వం మొదలైన వారిది. ఉపాధ్యాయులు గాని విద్యార్థులు గాని తమ బాధ్యతను పూర్తిగా సక్రమంగా నెరవేర్చలేక పోవడానికి కూడా చాలవరకు-వారి సొంత లోటు కాక ఆ 'తదితరుల' లోటే కారణ మవుతోంది. అది ఎలాగో వివరిస్తాను.

1. విద్యా ప్రమాణాల తగ్గుదలకు గల కారణాలలో ప్రస్తుతపు పరీక్షా పద్ధతి - అంటే ప్రమోషనులు చేసే పద్ధతి- ముఖ్యమైనది. క్రింది తరగతి చదువును సమగ్రంగా ముగించుకొన్నవానికే పైతరగతికి వెళ్లే అర్హత ఉండాలని ఎవరూ అనుకోవడం లేదు. క్రింది తరగతిలో పది విషయాలు నేర్చుకోవాలని 'సిలబసు'లో ఉండగా, అందులో మూడు నాలుగు విషయాలు తెలిసినా పైతరగతికి పంపిస్తున్నారు. ఇప్పుడిప్పుడు - ప్రజా ప్రభుత్వపు కాలం వచ్చిన తరువాత! - పదింట ఒకటి రెండు విషయాలు తెలిసినప్పటికే పైతరగతికి పంపుతున్నారు. ఆ ఒకటి రెండు విషయాలూ తెలియని వాళ్లను కూడా, అర్హత లేకపోయినా ఎక్కువ 'మార్కు'లు వేసి 'ప్రమోట్' చెయ్యాలని కోరుతూ, (విద్యార్థుల) తల్లిదండ్రులు పలుకుబడి-తమకు తెలిసిన పెద్ద లందరి పలుకుబడినీ ఉపయోగించుకొంటూ- ప్రయత్నిస్తున్నారు. ఆ మధ్య కొందరు శాసన సభాసభ్యులు కూడా ఈ విషయంలో తమ పలుకుబడిని ఉపయోగించినట్లు తెలుస్తోంది. "ఇలా పదింట ఒకటిరెండువిషయాలు కూడా తెలియని వాళ్లు పై తరగతికి వస్తూ ఉంటే, ఆ 'పైతరగతి' ఉపాధ్యాయులు వాళ్లకు ఆ 'పై తరగతి' పాఠాలు ఎలా చెప్ప గలుగుతారు?" అని ఆలోచించిన 'పెద్ద' లెవరూ కనబడరు. కనుక సెకండరీ పాఠశాలల విద్యార్థుల విద్యాప్రమాణాన్ని గూర్చి అక్కడి అధ్యాపకులను అడిగితే, హైస్కూళ్ళ నుంచి వచ్చే విద్యార్థులు తగినంత విద్యాప్రమాణం లేనివారవడం చేత, మే మేమీ చెయ్యలేకుండా ఉన్నామంటారు. హైస్కూళ్ళ ఉపాధ్యాయులను అడిగితే, ఎలిమెంటరీ స్కూళ్ళ నుంచి వచ్చేవారు అనర్హులుగా ఉంటున్నా రంటారు. (కాని మొదటి, రెండవ, మూడవ ఫారములలో, ప్రైవేటుగా చదువుకొని వచ్చిన విద్యార్థులను చేర్చుకోడంలో వాళ్లు కూడా అనర్హులను చేర్చుకోడమనే తప్పు చేస్తూనే ఉన్నారనుకోండి!) వాళ్ళ మాటలు అక్షరాలా నిజమని అంగీకరించవలసి ఉంటుంది. అసలు.

విద్యార్థులు క్రింది తరగతుల పాఠాలు చదువుకొన్నా రని విశ్వసించుకొని, వాళ్ళకు పనికి వచ్చేట్లు పై తరగతి పాఠాలు వ్రాస్తారు; లేదా బోధిస్తారు. క్రింది తరగతి పాఠాలు రానివారికి ఆ 'పై తరగతి' పాఠాలు ఎలా బోధపడతాయి? బోధపడవు. ఒకటి రెండు ఉదాహరణాలు చెపుతాను. రెండంకెలు గల సంఖ్యలతో (100 వరకు అన్నమాట) కూడికలు తీసివేతలు గుణకారాలు భాగహారాలు రెండవ తరగతిలో రావాలి. అవి వచ్చి యుంటాయని భావించి మూడవ తరగతిలో, రూపాయలు అణాలు మొదలైనవాటితో కూడికలు మొదలయినవి చెబుతారు. రెండవతరగతిలో వచ్చి యుండవలసిన కూడికలు మొదలైనవి రాకుండా నే విద్యార్థులను మూడవతరగతికి పంపిస్తే వారికి రూపాయల అణాల మీది లెక్కలు చెప్పడం ఉపాధ్యాయునికి ఎలా సాధ్యపడుతుంది? నామవాచకాలు మొదలైన భాషాభాగాలు క్రింది తరగతిలో తెలుసుకొని ఉంటే, వాటిలోని భేదాలు- సంజ్ఞావాచకం, జాతివాచకం మొదలైనవి- పై తరగతిలో బోధించడానికీ తెలుసుకోడానికీ వీలుంటుంది. ఇది విశేషణం, అది అవ్యయం అని నిష్కర్షగ తెలుసుకోలేని వాళ్లకు, ఇది లాక్షణికావ్యయం ఇది ప్రతిపదావ్యయం అని బోధించడం అర్థంలేని పని వేరే చెప్పనక్కరలేదు. తెలిసిన దానినిబట్టి తెలియనిది నేర్పాలని 'ట్రెయినింగు'లో చెప్తారు. క్రింది తరగతిలో 'తెలిసిన' జమా లేనప్పుడు పైతరగతిలో బోధించేది ఏమిటి? మొదటి ఫారంలోనూ, రెండవ ఫారంలోనూ నేర్పబడే విషయాలైనా తెలియని విద్యార్థులు ఆరవ ఫారంలో - అపైన కళాశాలల్లో కూడా - ఉంటూ ఉండడంచేత, వాళ్లను ఏ తరగతి వాళ్ళనుగా ఎంచి పాఠాలు బోధించాలో నిశ్చయించడానికి వీలు లేకుండా ఉన్నది. మొదటి ఫారం విద్యాప్రమాణం గల విద్యార్థులు పదుగురు, రెండవ ఫారం విద్యాప్రమాణం గల విద్యార్థులు పదుగురు ఇలా ఐదు ఫారాల తెగల విద్యార్థులతో కూడిన తరగతికి, ఐదవ ఫారం పాఠాలు చెప్పవలసిన ఉపాధ్యాయుడు వారికి విద్యాప్రమాణాలను [illegible] అసాధ్యం. కనుక ఏకాలానికి ఆ తరగతికి చెందిన విషయాలు పూర్తిగా తెలిసిన వాళ్లనే పైతరగతికి పంపాలి గాని, పదింట [illegible] విషయాలు మాత్రం నేర్చుకొన్న వాళ్లను పంపకూడదని ఈ సంగతిని అధికారులూ, విద్యావేత్తలూ గమనించేటంతవరకు, విద్యా ప్రమాణాలు పూర్తిగా బాగుపడజాలవు. కనుక ఈ విషయానికి సంబంధించినంతవరకూ, బాధ్యత, ప్రమోషనుల పద్ధతిని నిర్ణయించే ఉన్నతాధికారులదే కాని ఉపాధ్యాయులది కాదు.

2. విద్యాప్రమాణాలు తగ్గడానికి మరొక ముఖ్యకారణం, 'సిలబసు'లు ఆచరణయోగ్యంగా లేకపోవడం. సిలబసులు ఎంత అశాస్త్రీయాతిరేకాలుగా ఉన్నాయో తెలుసుకోవాలంటే, ఐదవ తరగతి కేర్పరచిన భూగోళశాస్త్రం చూడవచ్చు. మొదటి ఫారముకు సాంఘికశాస్త్రంలో ఏర్పరచిన సిలబసు కూడా అలాగే ఉన్నది. దాదాపుగా అన్నీ అలాగే ఉన్నాయి. ఇంతింత పెద్ద సిలబసులు ఏర్పరిస్తే ఉపాధ్యాయులు వాటిని సక్రమంగా బోధించడం గాని, విద్యార్థులు అవన్నీ పూర్తిగా నేర్చుకోడం గాని అసాధ్యం. ('ట్రెయినింగు'లో చెప్పే పద్ధతుల్ని సరిగా అనుసరిస్తే, డిపార్టుమెంటువారి సిలబసులలో ఎనిమిదవ వంతు కూడా, నియమిత కాలంలో, పూర్తి కావని చెప్పవచ్చును. ఆ పద్ధతుల్ని అంత సరిగా 'చాదస్తంగా' అనుసరించ నక్కరలేదని కొందరు అంటూ ఉంటారు. ఆ పద్ధతుల్ని అనుసరించకుండా, ఉపాధ్యాయుడు, పాఠాలు తొందరగా కావడానికి, తనకు తోచిన మరొక పద్ధతిలో బోధిస్తే, విద్యాశాఖాధికార్లు దాన్ని తప్పుగా ఎంచుతారు గాని, "షేష్! మంచి పని చేసినా" వని 'రిమార్కు'లలో వ్రాయరు. "ఇంతింత 'సిలబసులు' సకాలంలో బోధించడం అసాధ్యం" అని ఏ ఉపాధ్యాయుడైనా అంటే, "నీకు బోధనాసామర్థ్యం లేదన్నమాట" అని అంటారు-ప్రధానోపాధ్యాయులు గాని, ఇన్స్పెక్టింగు ఆఫీసర్లు గాని. కనుక ఉపాధ్యాయులు, సరియైన పద్ధతియా కాదా అని ఆలోచించకుండా, సకాలంలో, సిలబసులు పూర్తయినా యనిపించవలసివస్తోంది. ఇది బహిరంగ రహస్యం. ఇటువంటప్పుడు విద్యాప్రమాణా లెలా పెరుగుతాయి?

3. తగినంతమంది ఉపాధ్యాయులు లేకపోవడం కూడా విద్యాప్రమాణాల తగ్గుదలకు కారణమవుతోంది. ప్రస్తుతం, సాధారణంగా ఏ సెకండరీ పాఠశాలలోను, ఏ కాలేజీలోను - విద్యాశాఖవారి - లేదా విశ్వవిద్యాలయం వారి-నియమాల ప్రకారం ఉండవలసినంత మంది ఉపాధ్యాయులు లేరు. తక్కువమందియుపాధ్యాయులచేత నే ఎక్కువ పని చేయించాలనే కోరిక, సాధారణంగా ప్రతి మేనేజిమెంటులోనూ ఉన్నది. ఉపాధ్యాయునికి వారానికి 'ఇన్ని గంటల పని' ఉండాలని విద్యాశాఖవారు ఏదో కొంత ఆలోచించి నియమం చేస్తే, అది ఏదో అర్థం లేని నియమమన్నట్టుగా, ఎక్కువ పని చేయించాలని మేనేజ్ మెంట్లు ఆలోచిస్తూ ఉన్నవి. కళాశాలలో ఒక్కొక్క 'ట్యూటరు'చేత వారానికి ఇంత పని చేయించదగునని, విశ్వవిద్యాలయంవారు నియమం ఏర్పరిస్తే, దాన్ని లెక్క చెయ్యకుండా, అంతకంటె ఎక్కువ పని చేయిస్తారు- మేనేజ్ మెంట్లవారు. తక్కువ మంది చేత నే ఎక్కువ పని చేయించడమే ఒక ఘనతగా భావించి, ఆ విధంగా మేనేజ్ మెంటు మెప్పును పొందజూస్తారు - ప్రధానాధ్యాపకులు- చివరకు ఇదంతా వరకంగా తయారైనది. కాగా సాధ్యమైనంత తక్కువ జీత మిచ్చి సాధ్యమైనంత యెక్కువ పని చేయించుకోవాలనే ప్రతి మేనేజ్ మెంట్లలో ఉన్నప్పుడు, దానికి 'ప్రతిక్రియ' (Reaction) గా సాధ్యమైనంత తక్కువ (శ్రమలో) పని చేసి, సాధ్యమైనంత ఎక్కువ లాభం పొందాలనే ప్రవృత్తి ఉపాధ్యాయులలో కూడా కలగడం సహజం. 'వేతనం' యొక్క ప్రభావం అంతే కదా! అంతే కాకుండా, 'మంది యెక్కువైతే మజ్జిగ పల్చన' కాకుండా ఎలా ఉంటుంది? మనిషికి శక్తి, పరిమితమైనది. ఒకే పరిమితి గల శక్తి ఎంతపని కిస్తే అంత పనిమీదికీ పంచబడుతుంది; క్రొత్తగా ఎప్పటికప్పుడు అనంతంగా పుట్టుకొనిరాదు. అందుచేత ఈ విషయంలో ఉపాధ్యాయుల్ని నిందించడం అనవసరం; అసమంజసం. (పై యధికారులు అంటే విద్యాశాఖాధికారులూ, విశ్వవిద్యాలయాధికారులూ- మేనేజ్ మెంట్ల ఈ పద్ధతుల్ని చూస్తూనే ఊరుకుంటున్నారు. అనధికారులైన పెద్దలు కూడా అలాగే ఊరుకుంటున్నారు.)

4. ఉపాధ్యాయులు తగినంత అర్హత కలిగినవారుగా ఉండాలని ఎవరికీ పట్టినట్లు లేదు. తగినంత యర్హత కలిగినవారు, అనుకొన్న జీతానికి దొరకకపోతే, తక్కువ యర్హతకల వారినైనా వేసుకొంటారు గాని, ఎక్కువ జీతమిచ్చైనా ఎక్కువ యర్హత కలవారినే వేద్దామని ఎవరూ అనుకొంటూ ఉన్నట్లు లేదు. హైస్కూళ్లలో, బి. ఇ. డి. లు దొరకకపోతే బట్టి బి. ఏ. లను వేసుకొంటున్నారు. వాళ్ళూ దొరకకపోతే బి. ఏ. తప్పినవాళ్లనే వేసుకొంటున్నారు. బి. ఏ. లో గణితశాస్త్రం తీసుకొన్నవాళ్లు దొరకకపోతే, ఇంటర్ మీడియెటులో గణితశాస్త్రం తీసుకున్నవాళ్లను తీసుకొంటున్నారు. అటువంటివాళ్లూ దొరకపోతే, అసలు ఉద్యోగం ఖాళీగానే ఉంచుతున్నారు. స్కూల్ ఫయినల్ పరీక్షలో ఎలిజిబిలిటీతో ఉత్తీర్ణులైనవారు దొరకడంలేదని-'కంప్లీటు' చేసుకొనే పద్ధతిలో ఉత్తీర్ణులైన వారుకూడా దొరకడంలేదని - తప్పిన వాళ్లనే సెకండరీగ్రేడు ఉపాధ్యాయులుగా తీసుకొంటున్నారు. ఎలిమెంటరీ స్కూళ్లకైనా సెకండరీగ్రేడు అర్హతగా ఉండాలని విద్యావేత్తలంతా చెప్తూనే ఉన్నా, అందరూ సెకండరీగ్రేడు ఉపాధ్యాయులే అయితే ఖర్చు ఎక్కువ అవుతుందని, ఎలిమెంటరీగ్రేడ్ ఉపాధ్యాయులను ఇంకా తయారుచేస్తూ - ఉద్యోగాలకు నియోగిస్తూ - ఉన్నారు. ఇంక విద్యాసంస్థలలో విద్యాప్రమాణాలు తగక హెచ్చుతా యని ఎలా అనుకోగలం?

పైగా ఇంటర్ మీడియెటులో ఉత్తీర్ణులైన సెకండరీగ్రేడు ఉపాధ్యాయులు దొరుకుతూ ఉన్నా, స్కూలు ఫైనల్ పరీక్షలో తప్పిన సెకండరీగ్రేడు ఉపాధ్యాయులను వేసుకొంటున్నారు, కొందరు. 'ప్రచారక' అర్హత పొందినవారున్నా, ఆ యర్హత లేనివారిని వేసుకొంటున్నారు, కొన్నిచోట్ల. ద్వితీయ శ్రేణి ఎం. ఏ. లు ఉన్నా, తృతీయ శ్రేణి ఎం. ఏ. లనే వేసుకొంటారు, ఒక్కొక్క కళాశాలలలో. బి. ఏ. లో 'మూడవ పార్టు'క్రింద తెలుగు చదివినవారున్నా, 'రెండవ పార్టు'క్రింద తెలుగు చదివినవారినే వేసుకొంటారు, ట్యూటరుగా. ఈపరిస్థితులను పైయధికారులు అదుపు చెయ్యాలిగాని, ఉపాధ్యాయులమీద నెపం మోపితే ఎలా?

5. ఉపాధ్యాయుల ఇబ్బందులు కూడా కొంత పనికి అడ్డమవుతున్నాయి. ప్రైవేటు సంస్థలలో పనిచేసేవారికి, ఉద్యోగం ఏక్షణంలో పోతుందోయని భయమేనయ్యో! జూలై ఆగస్టులలో ఉద్యోగమిచ్చి, మార్చి ఏప్రిలులలో తీసివేసే, వేసవి సెలవుల జీతం మిగులుతుందని కొన్ని మేనేజ్ మెంట్ల ఆలోచన, జిల్లాబోర్డులవంటి వాటిలో పనిచేసే ఉపాధ్యాయులకు, సగటున, ఏడాదికి రెండు సెలవులు కుటుంబం ఒకచోటా, తానొకచోటా ఉండే ఇబ్బంది కలుగుతూ ఉంటుంది. ఏ చిన్నపని కావాలన్నా 'ఆఫీసు' చుట్టూ తిరుగుతూ ఉండవలసి వస్తూ ఉంటుంది, అర్జీలు బుట్టలోనే ఉంటాయి. నాలుగురోజులలో జరగవలసినపనికి నెలరోజులుపట్టినా, ఇంత అలస్యమైతే ఉపాధ్యాయుడు ఏమవుతాడు? అని అడిగే అధికారులు కనబడరు. స్కూళ్లలో మేనేజ్ మెంటు ఇయ్యవలసిన మూడు రూపాయలు ఇచ్చినట్లు దొంగసంతకం పెట్టితే, ఉద్యోగం ఉంటుంది, లేకపోతే లేదు. అలాగే మేనేజరుకు ప్రతి నెలా ఏ రూ 2/-లో కమీషను ఇస్తూ ఉండే ట్లయితేనే ఉద్యోగం ఉంటుంది. ఇవన్నీ రుజువు చేయడానికి వీలుకానివి కావచ్చు గాని, వాస్తవంగా జరుగుతూ ఉన్నదిమాత్రం అవును.

గ్రామాలలో పనిచేసే ఉపాధ్యాయుడు గ్రామస్థులందరికీ లోకువే. వీనికి మార్కులు వెయ్యమంటే వెయ్యాలి, వానికి తీసివెయ్యమంటే తీసివెయ్యాలి. లేకపోతే మర్యాద దక్కదు. విద్యార్థుల్ని శిక్షించకూడదు. విద్యార్థుల యెదుట నే ఉపాధ్యాయుల్ని తృణీకరిస్తూ ఉంటారు, పెద్దలు. అందువల్ల విద్యార్థులలో అవినయం, అవిధేయత ఏర్పడుతున్నాయి. అందువల్ల పాఠాలు సరిగాజరగవు. ఇది చాలాచిన్న విషయంగా కనిపిస్తుంది, గాని యిది చాలాముఖ్యమైన విషయం.

పరీక్షలలో విద్యార్థులు 'కాపీ' చేస్తూ ఉంటే ఊరుకోవాలి. లేకపోతే 'దస్మపద్ది' అవుతుంది. విద్యార్థుల యీ ప్రవృత్తిని పెద్దలు, హృదయపూర్వకంగా, అనుపుచెయ్యాలని పూనుకొంటే చెయ్యవచ్చు. కాని, వాళ్ళు చెయ్యరు. కాగా విద్యార్థుల చేతుల్లో ఉపాధ్యాయుడు ఉండవలసి వస్తోందన్నమాట. అటువంటప్పుడు, వానికి పనిచేసే ఉత్సాహం ఏపాటి ఉంటుందో వేరే చెప్పనక్కరలేదు.

ఉపాధ్యాయుల జీతాలు, వాళ్ళ పొట్టకు చాలవు. ఈ కరువుకాలంలో, కరువు జీతంలో కలుపుకొని, రూ 25/-లు జీతం (ఎలిమెంటరీ గ్రేడు వాళ్ళకు రూ 46/-లు మాత్రమే) వస్తూ ఉంటే, వాళ్ళు తిండి ఏమితింటారు? పాఠశాలలో పని శ్రద్ధగా ఎలా చేస్తారు? డబ్బులేకపోవడంవల్ల [illegible] అంటూ ఉంటారు, జీతాలు పెంచవలసిన అవశ్యకత ఉన్నదని గమనించి కూడా, డబ్బు చాలకపోవడం అనే కారణం చేత, ఇయ్యదగినంత జీతాలు ఇయ్యకపోవడం సమంజసమైతే, డబ్బు చాలకపోవడం అనే కారణం చేతనే, కూడు గుడ్డ వైద్యసహాయం మొదలైన ముఖ్యావశ్యకాలు సరిపడా సంభవల్లనే, చెయ్యదగినంత బాగా ఉపాధ్యాయులు పనిచెయ్యకపోవడం సైతకంగా చూస్తే-అసమంజస మెలా అవుతుందో ఆలోచించండి!

6. ఒక్కొక్క తరగతిలో ఉండదగిన విద్యార్థుల సంఖ్య 'దినదిన ప్రవర్ధమానం' గా ఉంటోంది. హైస్కూళ్ళలో ఇది 30 నుంచి 40 కి, 40 నుంచి 45 కు, 45 నుంచి 50 కి పెరిగినది; ఇంకా ఎంతవరకు పెరుగుతుందో తెలియదు. విద్యావిషయక కారణాలవల్ల కాక ఇతరకారణాలవల్ల ఈ పెంపు జరుగుతూ ఉండడంవల్ల, విద్యాప్రమాణాలు తగ్గిపోవడం అనివార్యమూ సహజమూ కూడా అవుతుంది.

ఈ సంఖ్య ఇలా పెరుగుతూ ఉండడంవల్ల ఒక్కొక్క ఉపాధ్యాయుడు చేయవలసిన వ్రాతపని పెరుగుతోంది. తరగతిలో పాఠాలు బోధించడానికి 'ఇన్ని గంటలు' అనే హద్దుఒకటి— ఆ హద్దును మేనేజిమెంట్లు పాటించినా పాటించకపోయినా- ఉన్నది. కాని యీ వ్రాతపనికి అటువంటిహద్దు ఏర్పడలేదు. అందుచేత పైన చెప్పినట్లు 'మంది యెక్కువైతే మజ్జిగ పల్చన' అవుతుంది!

7. ఎవరైనా కొందరు- కనీసం క్రొత్తగా వృత్తిలో ప్రవేశించేవారైనా- 'మజ్జిగ పల్చన' కాకుండా, శ్రద్ధగా పనిచెయ్యబోయినా, కొద్ది కాలంలోనే వాళ్ళకూ నిరుత్సాహం కలుగుతుంది. అలా పనిచేసినవాళ్ళకూ, పని యెగగొట్టి కూర్చున్న వాళ్ళకూ తేడా యేమీ, పైయధికారులు చూపకపోవడంవల్ల, (ఈ వ్యాసంలో తెలిపిన తక్కిన యిబ్బందుల కారణాన కూడా,) ఆ ఉత్సాహం నశించిపోతోంది. తిన్నగా పని చెయ్యనివాళ్లను శిక్షించడమనేది అంతగా లేదు. ఎవరైనా ఒకయధికారి అందుకు ప్రయత్నించినా, అంతకంటె పై ఆఫీసులవారు- మేనేజిమెంట్ల కుమాస్తాలనుంచి మంత్రులదాకా- వాళ్ళను కాపాడే వారు ఉంటున్నారు. అందుచేత శిక్షించబోయిన వ్యక్తి తెల్లపోయి కూర్చోవలసి వస్తోంది. ఈ కారణం చేత పని సరిగా చెయ్యకపోవడమే ఒక 'ఫేషన్' అయినది. నియమాలను బట్టి చెయ్యవలసినవిధాన పనిచెయ్యేవాళ్ళ 'చాదస్తులు'గా ఎంచబడుతున్నారు. కొన్ని సార్లయినా నియమభంగం చెయ్యనివాళ్ళు 'లోక వ్యవహారజ్ఞానము' లేని వాళ్లని ప్రస్తుత లోకపు అభిప్రాయం. ఈ కారణం చేతనే పై పదవులను 'ప్రమోషన్లు' చెయ్యడంలో పనిలోని నేర్పరితనాన్ని గాని, శ్రద్ధనుగాని, నియమాలను పాటించే బుద్ధిని గాని లెక్కకు తీసుకోకుండా, కులాన్ని అటువంటి ఇతర విషయాలనూ తీసుకొంటున్నారు. విద్యాశాఖాధికారుల దయ ఉంటే 'సీనియారిటీ'నిమాత్రం కొంచెం గమనిస్తున్నారు. సమర్థులైన యుపాధ్యాయులను సమర్థులని చెప్పడం ప్రధానోపాధ్యాయులు మొదలైన పై యధికారులకు అంతగా ఇష్టం ఉండదు. సహోపాధ్యాయులు తమకంటె గొప్పవాళ్లయిపోతారేమో యని, వాళ్లను కొంచెం అణచియేయుంచాలని వాళ్ల తలంపు. ఎప్పుడైనా వాళ్ళ దయను ఎవరైనా సంపాదించుకోగలిగితే, అది, శ్రద్ధగా 'డ్యూటీ'ని నిర్వర్తించడంవల్లగాక, వాళ్లుచేసే పనుల కన్నింటికీ- అవి ఎటువంటివైనా సరే- 'తందానా' పాడడంవల్ల నే. అత్యంత శ్రద్ధతో పనిచెయ్యడం సుగుణంగా పరిగణించబడకపోగా, 'పెద్దల' దృష్టిలో నే, ఒకవిధమైన తప్పుగా పరిగణించబడుతోందని నేనంటే, ఎవరూ ఆశ్చర్యపడనక్కరలేదు. ఇటువంటి పరిస్థితుల్లో ఉపాధ్యాయునికి ఉత్తమమైన పద్ధతుల్లో పనిచెయ్యడం ఎలా కుదురుతుంది?

8. ఉపాధ్యాయులు పాఠాలు సరిగా బోధించినంతమాత్రానచాలదు. అవి విద్యార్థులు సరిగావినాలి; విన్న తరువాత చదవాలి. సరిగా వినడానికి క్రమశిక్షణ లేమి కొంత ఆటంకంగా ఉంటోంది. సాధారణంగా ఇంటివద్ద తల్లిదండ్రుల అదుపాజ్ఞలలో బడి యుండే విద్యార్థులు పాఠశాలలలో కూడా చాలావరకు తిన్నగానే ప్రవర్తిస్తారు. పాఠశాలలలో క్రమశిక్షణంలో ఉండనివారు, సాధారణంగా, ఇంటివద్ద పెద్దల అదుపులేనివారే అయి యుంటున్నారు. ఇంటివద్ద ఎల్లప్పుడూ ఉంటూ తల్లిదండ్రులమీద ఆధారపడిఉంటూ ఉన్నప్పటికీ, వాళ్ళ లెక్కలేకుండా ఉండడానికి అలవాటుపడ్డ బాలురు, పాఠశాలలో కొన్నిగంటలుమాత్రం ఉంటూ, తాము పాఠశాలలకిచ్చే జీతాలవల్లనే ఉపాధ్యాయులు జీవిస్తున్నారనే భావం తమ పెద్దలచేత కలిగించబడుతూ ఉండగా, వాళ్లఅదుపునకు లోబడి ఉండడం సుసాధ్యం కాదు.

విద్యార్థులలో అవినయాన్ని రేకెత్తించడానికి రాజకీయపక్షాలు బాధ్యతవహించవలసి యుంటుంది. ఇదివరకు స్వాతంత్ర్య సమరంలో విద్యార్థులసహాయం కోరవలసివచ్చినది. అప్పుడే విద్యార్థులలో అవినయమే [illegible] ల్పించబడినది. అది అప్పటికి అవసరమైనది. కాని యిప్పటికీ రాజకీయపక్షాలు విద్యార్థుల్ని అలాగే ఉపయోగించుకొంటూ ఉండడం కనిపిస్తోంది. ఇకనైనా విద్యార్థుల్ని రాజకీయాలనుంచి తప్పించాలని రాజకీయ నాయకులు గ్రహించి విద్యార్థులలో క్రమశిక్షణం నెలకొల్పకపోతే, భావి భారతపౌరులైన విద్యార్థులూ, భావి భారతదేశమూ సరియైన అభ్యున్నతిని పొందడం సాధ్యపడదు.

9. విద్యార్థులు పాఠాలు సరిగా వినడమే కాక చదవడం కూడా, విద్యాప్రమాణాల అభివృద్ధికి అవసరమే. అది ప్రస్తుతం జరగడంలేదు. అందుకు మూడు ముఖ్య కారణాలున్నాయి. విద్యార్థులు సరిగా-పూర్తిగా-చదవకపోవడంవల్ల వాళ్లకు హాని యేమీ కలగడం లేదు. చదవనందువల్ల మార్కులకూ ఉత్తీర్ణతకూ లోటు అంతగా కలగడంలేదు. నూటుమార్కుల లో ముప్పైరెండ్ - ఇప్పుడిప్పుడు పదిహేను - మార్కులు ఉత్తీర్ణతకు సరిపోతున్నాయి. అందుచేత "ఈ విషయాలు పరీక్షలో విడిచిపెట్టవేదాం" అని మొదటినుంచే విద్యార్థులు అనుకొంటున్నారు. కొన్ని విషయాలు విడిచిపెట్టాలనే ఆలోచనయే గాని, విద్యార్థులకు, కొన్ని విషయాలు అదనంగా చదువుకొందామనే ఆలోచన సాధారణంగా ఉండడం లేదు. ఆకొద్ది (పదిహేను ఇరవై) మార్కులైనా, స్వయంగా చదివి తెచ్చుకోవలసిన అవసరం అందరికీ ఉండడంలేదు. కొందరు 'కాపీ'మీద ఆధారపడుతున్నారు. అందుకు సామ దాన భేద దండోపాయాలు ప్రయోగిస్తున్నారు. మరికొందరు 'మార్కులు వేయించుకోడం' కోసం ప్రయత్నిస్తున్నారు. ఉత్తీర్ణత పొందడానికి ఇన్ని-ఇలాంటి-మార్గాలు ఉండగా, బాగా చదవాలనే 'బాధ' ఏ కొద్దిమంది 'ధాందినులకో' తప్ప ఉండదు. ఇదొక కారణం.

ఇక రెండవ కారణం నిజంగా పాఠశాలలలో చెపుతూఉన్న విషయాలన్నీ పూర్తిగా గ్రహించడంగాని, గ్రహించి జ్ఞాపకం ఉంచుకోడంగాని సాధారణ విద్యార్థికి సాధ్యంకాదని చెప్పవలసి ఉంటుంది. పాఠశాలల్లో బోధించే విషయాలేవీ దైనందిన జీవితానికి సంబంధించినవి కావు. అందుచేత వాటిని గ్రహించడమూ కష్టమే; గ్రహించినా జ్ఞాపకముంచుకోడమూ కష్టమే. పైగా సిలబసులు, విద్యార్థులు గ్రహించగలరా లేరా అనే ఆలోచన అంతగా పెట్టుకోకుండా, పెద్ద పెద్ద-ఆదరణ యోగ్యాలు కాని-ఆదర్శాలు మనస్సులో పెట్టుకొని రచించడంవల్ల కూడా కొంత క్లిష్టత యేర్పడుతోంది. ఆ సిలబసులనుబట్టి వ్రాసిన పుస్తకాలు కూడా విద్యార్థుల గ్రహణశక్తిని మనస్సులో పెట్టుకొని వ్రాసినట్లు ఉండడం లేదు; ట్రెయినింగులో బోధించబడే పద్ధతుల ప్రకారం అని రచించబడడంలేదు. అందుచేత విద్యార్థులకు అవి సుగ్రాహ్యంగా లేకపోతున్నాయి. తక్కువ అర్హతలు గల ఉపాధ్యాయులు, తక్కువమంది, పలువిధాల యిబ్బందులు పడుతూ సరిగా బోధించలేకపోవడం ఈ చిక్కులకు తోడవుతోంది.

ఇవన్నీ ఇలా ఉన్నా, విద్యార్థుల చేత చదివించాలనుకొన్నప్పటికీ, పాఠశాలల కాలవ్యవస్థ అందుకు ప్రతిబంధకంగా ఉన్నది. హైస్కూళ్ల సంగతి ఉదాహరణంగా తీసుకొని చూదాం. పాఠశాలలో ఒక 'పీరియడు'లో-అంటే సుమారు 40 నిమిషాలలో-రెండుమూడు పద్యాలు ఉపాధ్యాయుడు బోధించినట్లయితే-ప్రస్తుతపు సిలబసులను సకాలంలో పూర్తిచెయ్యాలంటే ఇంకా ఎక్కువే బోధించవలసి ఉంటుంది-ఇంటివద్ద ఆ పద్యాలకు సంబంధించిన చదువు సమగ్రంగా పూర్తిచెయ్యడానికి, సాధారణ మేధావంతుడైన విద్యార్థికి, ఒక గంట పడుతుంది. ఇట్లా పాఠశాలలో కనీసం ఐదారుపీరియడులలో పాఠాలు జరుగుతాయి. కనుక అయిదారు గంటలసేపు ఇంటివద్ద విద్యార్థులు చదవాలన్నమాట. ప్రొద్దుట పదిగంటలనుంచి సాయంకాలం ఐదుగంటలవరకూ పాఠశాలలో నే ఉన్న విద్యార్థి, ఇంటివద్ద మళ్లీ ఐదారుగంటలు పనిచెయ్యాలనడం క్రూరం; అసాధ్యం. (ఎలిమెంటరీ స్కూళ్ల సంగతి చెప్పాలంటే వాళ్లు ఇంటివద్ద చదవవలసిన అవసరం అంతగా ఉండకపోయినప్పటికీ ఐదుగంటలసేపు బడిలోనే కూర్చోవాలనడం కూడా బాగాలేదు. చిన్నపిల్లలకు బడిలో ఉండే సమయం సాధ్యమైనంత తక్కువగా ఉండాలి.) పాఠశాలలో చదువుకొన్నది మళ్ళీ చదువుకోడానికి రెండవపూట ఖాళీగా ఉండాలి. పాఠశాలలో జరగవలసిన పనిలో, ఈ పద్ధతివల్ల, కలిగేలోపాన్ని, సెలవులు తగ్గించడం ద్వారా పూర్తిచేసుకోవాలి. అసలు ఇన్నిసెలవులు అనవసరం. ఏడాదిలో సగం (180) రోజులు, విద్యార్థుల్ని రోజుకు పదిగంటల చొప్పున బడిలో పట్టించి పీడించి, తక్కిన సగం (185) రోజులు గాలికి విడిచిపెట్టడం ఎక్కడి 'సైకాలజీ'యో తెలియకుండా ఉన్నది. ఏడాదిలో 180 రోజులు రోజుకు నాలుగుపూట్ల చొప్పున భోజనంచేసి, తక్కిన 185 రోజులూ ఉపవాసం ఉండాలనడం ఎటువంటి 'ఫిజియాలజీ' అవుతుందో, ఇది అటువంటి 'సైకాలజీ' అవుతుంది.

ఇలా పరిశీలించి చూడగా విద్యార్థులు సరిగా చదవలేకపోవడానికి కూడా చాలా [illegible] పెద్దలే కారణభూతులవుతున్నారని తెలుస్తోంది.

ఈ విషయాలన్నీ పరిశీలించినప్పుడు, విద్యాప్రమాణాల తగ్గుదలకు కారణాలు ముఖ్యంగా విద్యావేత్తలలోనూ, తక్కిన పెద్దలలోనూ ఉన్నాయి గాని, ఉపాధ్యాయులలో లేవని తెలియగలదు. మొదటనే చెప్పినట్లు, ఉపాధ్యాయులలోటు అసలే లేదని నేను అనడంలేదు. వారి బాధ్యతానిర్వహణంలో కూడా లోపం చాలాఉన్నది; కాని అందులో చాలాభాగం, 'పై' వారి కార్యవిధానాలకు ఫలితమే యని మాత్రమే చెప్పవలసియున్నది. కనుక విద్యాప్రమాణాల తగ్గుదలకు ఉపాధ్యాయులపై బాధ్యత వేసేముందు, ఈ పై వివరించిన లోపాల్ని సర్దుబాటు చెయ్యడానికి పెద్దలు - అధికారులు గాని అనధికారులు గాని-పూనుకోవడం సమంజసమని ఉపాధ్యాయులపక్షాన నా సవినయ ప్రార్థన.

మద్రాసు రేసులు
1953-54
(మద్రాసు రేసింగు రాయల్టీ [illegible])
[illegible]
ఆదివారము-27 డిసెంబరు 1953
"స్ప్రింటర్స్" కప్పు
శుక్రవారము - 1 జనవరి 1954
"గవర్నర్స్" కప్పు
"రేస్ క్లబ్" కప్పు

మీ బిడ్డ జబ్బుతో అవస్థపడు చున్న యెడల బి. సి. పి. డబ్లియు
గ్రైప్ మిక్చర్



దివ్యంగా పనిచేయును.
అజీర్ణము, పిత్తము, బంక విరేచనములు.
పండ్లువచ్చుకాలమునసాధారణముగకలుగు జబ్బులు వగయిరా అన్నిటిని కుదుర్చును.
BENGAL CHEMICAL
కలకత్తా, బొంబాయి, కాన్పూరు.
ఏజంటు: ఎ. వేలాయి గౌండర్ & కో.,
41, బందరువీధి, మద్రాసు.

ఆంధ్రబ్యాంకు లిమిటెడ్
(స్థాపితము: 1923)
ప్రధాన కార్యాలయం: మచిలీపట్టణం.
(షెడ్యూల్డు బ్యాంకు)
సీజను డిపాజిట్లు
మా బ్యాంకియొక్క అన్ని బ్రాంచీలయందును సీజను డిపాజిట్లు 30-6-54 తేదీతో గడుస్తు యగునట్లు ఈ దిగువ సుదహరించబడిన వడ్డీరేట్లకు 3 నుండి 6 మాసముల పరిమితికిరీసుకోబడును
1 రు 1,000/-ల. అపై మొత్తములకు నూటికి సంవు రు. 3 చొప్పున
2 రు 5,000/-ల.అపైమొత్తములకు నూటికి సంవు రు 3-4-0చొ॥న
3 రు 10,000/-లుపైమొత్తములకునూటికి సంవు రు 3-8-0చొ॥న
వి.లక్ష్మీపతి రామచంద్రమూర్తి,
ఎం. ఏ., సి ఏ ఐ ఐ బి
జనరల్ మేనేజరు. 1-12-53

నారసింహ లేహ్యము



బంగారు చేర్చబడినది. మేహము,నిర్వీర్యం,నిస్సత్తువ,కుష్ఠ నష్టమును హరించి బలమును, కాంతిని, వీర్యవృద్ధిని గలిగించును. వర్ణవసాదము—
20 రు॥ డబ్బి రు 3-4-0 పోస్టేజి 15 అ॥
పి.సి.ఏ.శివరంగన్."ఆయుర్వేదనిలయం"
పెరిజేపి, నెల్లూరు జిల్లా.

PUJA-DIWALI SALE
At 50% Reduced Prices for Season.
Each Swiss Made: Gtd. 3 Yrs.



No. 44 Size: 6½
5 Jewels Chrome or Rolled Gold 28/-
15 Jewels Chrome or Rolled Gold 33/8



No. 45 Size: 8½
5 Jewels Chrome or Rolled Gold 26/-
15 Jewels Chrome or Rolled Gold 32/-
5 Jewels Non-Second 13 Size 14/8



No. 46 Size 10½
15 Jewels Chrome, Steel Back 35/-
15 Jewels —do— Small 8½" Size 39/-
17 Jewels Chrome, Steel Back 42/-



ALARM TIMEPIECE
Smith — 15/-
West-Clox — 17/8
Germany — 16/-
Pocket Watch 10/-
Young India Watch Co.
Post Box No. [illegible], Calcutta.

# వ్యవసాయ సంక్షోభం

(9-వ పేజీ తరువాయి)

నది, బీసలసండి ఎన్ని ఎకరాలు వ్యవసాయేతరుల పరమైంది, ఆ వివరాలు లేవు. పైగా యీ కాలంలో ప్రాంప్టు డ్యూటీ కూడా పెరిగింది. అందుచే యీ విషయమై యింకా స్పష్టంగా తెలిసే గాని స్పష్టమైన ఒకదృక్పథంకలుగదు. రిజిస్ట్రేషన్ లెక్కలు అంత ప్రకటన మైనవి కాజాలవు. ప్రాంప్టు డ్యూటీ తగించుకోటానికి, రైతులు అసలు క్రయానికి తక్కువ ప్రాపారం ఆలవాటు. కాని దీనిని బట్టి మొత్తంమీద అమ్మకాలు ఎక్కువైవున్నవని పై లెక్కలవల్ల తేటతెల్ల మౌతున్నది.

## సత్తెనపల్లి తాలూకాలో భూమి మార్పిడి

తొలూకాలో 1930-34 సం||రాల్లో వ్యవసాయదార్లు అనేక నూసులుభాగా ఉన్నారు. అనేక సర్వేలు యీనాములు వర్తక వ్యాపారుల పరమైనవి. ఇటీవల యుద్ధానంతరం పెంలు పొలాలు అమ్మకోటం, అప్పులకింద కట్టటం జరిగింది బెలంకొండ ఫిర్కాలో సుమారు 12-15% భూమి యీ అమ్మకాలు జరిగినవి పొలాలు ముఖ్యంగా వ్యవసాయేతరులైన వడ్డీ వ్యాపారుల వదిన, కొందరు భూస్వాముల వదిన చేరినవి

ఇటీవల 4 సం||రాల నుంచి కౌలు పాక్కులు పుడుతున్నాయి. భూమి సంస్కరణలు వస్తవని కొందరు భూస్వాములు సాహుకార్లు కూడా పొలాలు అమ్ముకున్న ఉదాహరణలున్నవి. పొలంపై నున్న వత్తిడివల్లా, భూదాహంతో మధ్యతరగతి రైతులు, కొందరు ధనిక రైతులు, బాకీసాకీలు చేసైనా కొద్దిగా కొనుక్కున్నారు ఐతే వీళ్ళిప్పుడు అప్పులపాలై యున్నారు. ఇవి 15

పల ధరల పెరుగుదలలు ధనికులకు భూస్వాములకు లాభించి, బీద మధ్యతరగతి రైతులను నాశనం గావించింది" అని స్పష్టపరిచారు. మధ్యతరగతి రైతుల అప్పులు 1939 సం||లో 43.5% వున్నదల్లా 1945 సం||లో 41.0% తగ్గిందనీ, సామాన్య పట్టాదారుల అప్పులు 35.3% నుంచి 38.7% పెరిగిందనీ అంటే 3.4% పెరిగిందని వ్రాశారు.

ఈ కాలంలోని రైతుల పరిస్థితులను గూర్చి రాఘవేంద్రరావు, యీ క్రింది విధంగా వ్రాశారు: "వ్యవసాయదార్లు ఆర్థిక దుస్థితికి గురియైనారు. వ్యవసాయఖర్చులు విపరీతంగా పెరిగినవి దీనితోపాటు పారిశ్రామిక సరకులు కొనుగోలు వస్తువుల ధరలు చుక్కలంటినవి. తన కుటుంబపోషణకుమించి అమ్ముకోటానికిలేని పుట్టి తడావునికి యీ ధరల పెరుగుదల ఏమీ లాభించలేదు. బీదరైతులు, కౌలుదారుగూడా యిదేస్థితిలో వున్నారు. పండే పంటలో తమకొచ్చే వాటుభాగం, తమ కుటుంబావసరాలకే గడుపుకోటానికే చాలకపోతున్నది. ఐతే అమ్ముకోటానికి బాగా అదనంగావున్న భూస్వాములుమాత్రం యీ అధికధరల అవకాశంవల్ల అధిక లాభాలు పొందారు. వీళ్ళ ఆర్థికపరిస్థితులు చాలా బాగుపడ్డం."

## దారుణమైన అప్పులు

రైతులనుకుంగ దీస్తున్న వాటిలో ఋణభారము ప్రధానమైంది. మద్రాసు రాష్ట్రం అప్పులను గూర్చి 1930 సం||లో మద్రాసు బ్యాంకింగ్ ఎంక్వయిరీకమిటీ 140 కోట్ల రూ. అని వ్రాశారు. అంతకుపూర్వం 1895 సం||లో సర్ ఫ్రెడరిక్ నికల్సన్ మద్రాసు ఋణాలు 45 కోట్ల రూ. అన్నాడు.

...

## మూడు జలగలు

1. వడ్డీ వ్యాపారి 2. పన్నులు 3. పెద్ద భూస్వాములవారి దోపిడీ విధానం. యీ మూడు జలగలు రైతులను పీల్చి పిప్పి చేస్తున్నవి. ప్రతి 10 ఏండ్లలోను రీసెటిల్‌మెంటు పద్ధతి వల్ల

...

యుద్ధకాల ధరల పెరుగుదలవల రైతులు బాగుపడ్డారా? అని పరిశీలిస్తే ప్రభుత్వ రిపోర్టులనుంచే యీ క్రింది విషయాలు తేటతెల్ల మౌతున్నవి.

శ్రీ బి. వి. నారాయణస్వామినాయుడుగారు వ్రాస్తూ "వ్యవసాయదారు




Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras.

## ఆంధ్రప్రభుత్వ కర్తవ్యం

...



1931 లో లెస్నీకి రవీంద్రుడు వ్రాసిన లేఖ.

రవీంద్రుడు వంగభాషలో లెస్నీకి వ్రాసిన మరొక లేఖ.

# జెక్ భారతదేశాల సాంస్కృతిక బాంధవ్యం

# ప్రొఫెసర్ విన్‌సెంట్ లెస్నీ

మూలం: పావెల్ పోచా
అనువాదం: నిష్పాణి

ప్రతిభాశాలి మాక్స్ ముల్లర్ వేద వేదాంగాలను జర్మన్ భాషలోకి తర్జుమా చేశాక, చివరను ఒకమాట వ్రాశాడు. "పునర్జన్మ అనేది నిజమైతే, భగవంతుడా! పుణ్యభూమియైన భారతదేశంలో నన్ను పుట్టించు" అని వేడుకొన్నాడు.

...



శాంతినికేతనంలో టాగూర్ లెస్నీల గోష్ఠి (1928).

...




ప్రొఫెసర్ లెస్నీ రచించిన "భారతదేశం, భారతీయులు" అనే గ్రంథానికి వేసిన విచిత్రమైన ముఖచిత్రం.

# సినిమా

## నగరంలో సినిమాలు

| | | |
|---|---|---|
| శ్రీకృష్ణా, ఉమా, ప్లాజా | పంజమ్ (తమిళం) | |
| కాసినో, బ్రాడ్వే | మదంపోల మాంగళ్యం | ,, |
| పారగన్, క్రౌన్, సరస్వతి | లక్ష్మి | ,, |
| ప్రభాత్, చిత్రా, పయోని | అవన్ | ,, |
| సన్ | సింగారి | ,, |
| గెయిటీ, భారత్, లక్ష్మి | మాన్ అండ్ ద బీస్ట్ | ,, |
| వెల్లింగ్టన్ | అవ్వయార్ | ,, |
| కినిమా సెంట్రల్ | జ్ఞానసౌందరి | ,, |
| రాజకుమారి | ఝమేలా | (హిందీ) |
| స్టార్ | అగ్ కాదర్యా | ,, |
| అశోక్ | లైలామజ్నూ | ,, |
| సెలెక్టు | అనార్కలీ | ,, |
| మినర్వా | Gone with the Wind | |
| న్యూఎల్ఫిన్‌స్టన్ | By the Light of the Silvery Moon | |
| న్యూగ్లోబ్ | Cale me Madam | |
| రాక్సీ | Paula | |
| ఒడియన్ | Peter Pan | |
| మిడ్‌లాండ్ | Small Town Girl | |

'అగ్ కాదర్యా'

...

'లైలామజ్నూ'

...

# నయాగరా యాత్ర

(7-వ పేజీ తరువాయి)

న్నారు" అని నేను సమాధానం చెప్పి ఆయన సహాయంతో నాకు కావలసిన వన్నీ తీసుకొని ఆయన కూర్చున్న టేబుల్ కు ప్రక్కగా మరోక టేబుల్ వద్ద నేను కూర్చున్నాను. ఆయన టేబుల్ వద్ద మిస్ హామ్ కూడా కూర్చునివుంది. ఆమెను నాకు పరిచయం చేసి, యిద్దరు కలసి హిందూదేశాన్ని గురించి, యీ దేశపు ప్రజల్ని గురించి ఎన్నో విశేషాలడిగి తెలుసుకున్నారు. మిస్ హామ్ కు యింగ్లీషు ఏమాత్రం రాదు. అందువల్ల మిస్టర్ గోల్ బర్ ద్వారానే ఆమె నాతో సంభాషించటం జరిగింది. మా భోజనాలు, పూర్తయ్యేలోపుగా వీళ్ళిద్దరూ నన్ను తమయింటికి ఆహ్వానించటంకూడా జరిగింది. వస్తానని మాటయిచ్చాను.

అనుకున్న సమయం ప్రకారం నేను వారింటికి చేరేసరికి మిస్టర్ గోల్ బర్గ్, మిస్ హామ్, ఆమెయొక్క చెల్లెలు నాకోరకు ఎదురుచూస్తున్నారు. మిస్టర్ గోల్ బర్గ్, మిస్ హామ్ వివాహం చేసుకుంటానికి నిశ్చయించుకున్నారు. మిస్టర్ గోల్ బర్గ్ ఒక స్కూలు టీచరు. మిస్ హామ్ అక్కడ ఒక గవ

...

మనం చూడకుండా ఆ దేశాన్ని గురించి, ఆదేశంలోని ప్రజలనుగురించి తెలుసుకోవటం ఎంతకష్టమో వారికి కూడా మనదేశాన్ని గురించి తెలుసుకోవటం అంతకష్టమే మూను. వారు హిందూదేశాన్ని గురించి వెన్నడిగే ప్రశ్నలు ఎంతో వింతగావుండేయి. ఎక్కువగా మనదేశంలోని ప్రజలను సహజమయిన ఆధ్యాత్మిక దృక్పథం వారికాశ్చర్యాన్ని కలిగిస్తూవుంటుంది. ఎంతో సేపు కబుర్లతో గడిపాక నేను తిరిగి నా హోటలుకు ప్రయాణమయ్యాను. అప్పటికి రాత్రి సుమారు 11-30 గంటలయ్యింది. యిక్కడ మామూలు ప్రకారం యింకా సంధ్యాసమయంగా వేవుంది. నేను వెళ్ళిగలనని చెప్పినా వినక నన్ను హోటలువద్ద దిగబెట్టడానికి వారుకూడా మేడక్రిందకువచ్చి, వీధిలో నిలబెట్టివుంచిన సైకిళ్ళు ఒకొకరు ఒకొకటి తీసుకు బయల్దేరారు. నేనాశ్చర్యపోయి "యీ సమయంలో మీసైకిళ్ళ నిక్కడ వదిలి

"పేలా కేమిటి" అన్నాను. "యిక్కడ వదిలితే, ఎవరయిన సైకిళ్ళు ఇక్కడ కోస్తు ప్రక్కలవే తమ ఇక్కుయుంగు పెట్టుకుంటారు తమ సైకిలు కాని దానిని ముట్టుకోను వారు ఉండరు" అన్నారు!

అస్లోవలో సెస్టాల్ హాంలో కూడా ఒక "ఫోల్క్ మ్యూజియం"వుంది. యీ రెండిటి మధ్య ఎక్కువ తేడాలేదు. అయితే స్టాక్‌హోంలోని యీ "ఫోక్స్ మ్యూజియం" కేవలం మ్యూజియంగా మాదిరిగానే కాకుండా వినోదప్రదర్శనాల నిమిత్తం కూడా ఉపయోగిస్తున్నారు. యిందులో ముఖ్యంగా వేసవికాలంలో ప్రతిరోజు స్వీడిష్ సంస్కృతిని వ్యక్తపరిచే ఏదో ఒక ప్రదర్శనం జరుగుతూ వుంటుంది. నేనున్నరోజున దేశం యొక్క వివిధ ప్రాంతాల్లో పూర్వులు ధరించే రకం దుస్తులను ధరించి ఎంతో మంది నృత్యం చేశారు. యీ దేశాల్లో రకరకాల "కాస్ట్యూమ్స్" వేసుకుని నృత్యాలు చేయటం ప్రజల కెంతో సరదా. అందువల్ల సాధారణంగా చాలామంది తమకు తగినరకం "కాస్ట్యూమ్స్" ఎప్పుడూ యిట్లాంటి సందర్భాలలో వాడటానికి సిద్ధంగా వుంచుకుంటారు.

...

కనీసం యిరవైరెట్లయినా అభివృద్ధి చెందాయి - యీ దేశంనుండి ఎగుమతి అయ్యేసరుకుల్లో కాగితాల పరిశ్రమకు సంబంధించిన సరుకులు ముఖ్యమైనవి. యివిగాక, యింకా నోకల నిర్మాణం, వాటి ఎగుమతి కూడా యీ దేశంలో ముఖ్య వ్యాపారాలు.

## దక్షిణ భారత సంగీతమహాసభ

పై సభ యాజమాన్యమున ఈ సాయంత్రం 6 గం|| గోఖలే హాలులో శ్రీమతి యం. యస్. సుబ్బులక్ష్మి సంగీత కచ్చేరి జరుగుతుంది.


భారత్ క్రాస్వర్డ్సు
75, హారిస్ రోడ్, మద్రాసు-2.
రిజిస్టరు నెం. 1866
బహుమతుల క్రింద ప్రతివారం
రూ. 75,000
ఇవ్వబడును.
74-వ పోటీ సరియైన జవాబు:
1 1 3 1 1 1 1 1 1 1 2 2 2
'భారత్' కూపనులు మా ఏజెంట్ల వద్ద దొరుకును.
ప్రతిచోట కూపను కలెక్టర్లు, డిపో ఏజెంట్లు కావలెను

మనోరమ తేయాకు
వాడండి
దీనికి మరొకటి సాటిలేదు.
స్టాకిస్టులు ఏజెంట్లు కావలెను.
వివరములకు:
శ్రీ పి. రాజగోపాల్,
జిల్లా ఆర్గనైజర్
6/42, రామారావుపేట, పోర్టు, కర్నూలు.

శతమూలికాదిలేహ్యము
లోహభస్మ సిందూరములతో సహా చేయించిన సమస్త సుఖవ్యాధులవలన కలుగు బాధలు, శరీరమున ఎర్రగ, తెల్లగ బయలుదేరు పొడలు, మచ్చలు, కుష్ఠువులు, మధుమేహము, అతిమూత్రము, విస్ఫోటకము, శుక్లనష్టము, నపుంసకత్వము నివారించి సకముల పటుత్వము వీర్యవృద్ధి బలము కలుగజేయును, స్త్రీల ఋతుబాధలు, ఎరుపు తెలుపు కుసుమ, నష్టసంతానము నివారించి మంచి సంతానము కలుగజేయును.
40 రోజులకు మందు రు. 18-0-0, పోస్టేజి రు. 1-10-0
శ్రీ భుజంగరావు వైద్యశాల, తాళ్లరేవు, తూ|| గో|| జిల్లా

మిక్కిలి రుచి & ఉత్తమమైనవి.
యల్. ఆర్. కె. లక్ష్మి బీడి
1914 నుండి
విస్తారముగ
అమ్మబడుచున్నవి.
ప్రొప్రయిటరు:
యల్. ఆర్. కె. లక్ష్మణన్,
వెల్లూరు.
ఉ. ఆర్కాటు. (ద. ఇండియా)


